శ్రీసచ్చిదానందమూర్తయే నమః



హిందూమత సిద్ధాంతములలోని

# ఆత్మతత్వప్రకాశిక.



ముముక్షుల కత్యంతోపయుక్తంబగునటుల

శ్రీమత్పరమకల్యాణ నిర్గుణ

పరబ్రహ్మచైతన్యులగు

నీలకంఠ యల్లమంద్రయ్య దేవర వారి శిష్యుడును

హిందూగరల్సు స్కూల్ మాస్టరును నగు

ఇమడాబత్తుల సుబ్బరాయదాసునిచే

రచియింపబడి

రామమోహన ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపబడెను.



మొదటికూర్పు 1000 కాపీలు.

ఏలూరు 1910] [దీని వెల 9 పైసలు.

# ఉపోద్ఘాతము.



ఈశ్వరాంశసంభూతులగు శ్రీ విద్యారణ్యస్వాములవారు రచియించిన పంచదశియన్గ్రంథము చదివినదిమొదలు, అట్టి ప్రశ్నోత్తరరూపకమగు కొద్దిపాటి పాత్తములను సకలజనోపయోగమగునటులను, ముఖ్యముగ హిందూపాఠశాలలలో చదువు బాలుర, బాలికల నిమిత్తమును వ్రాయవలయునని బహుకాలముక్రింద బొడమినసంకల్పము నేటికి స్వామియొనగూర్చినందులకాయన కనేకవందనములు సమర్పించుటయేగాక ఈ గ్రంథమునుచదువువారి హృదయములలో పూర్ణముగ దీనినినాటింపజేసి సద్యోముక్తినొసంగనై సదా ప్రార్థించుచున్నాడ.

దీనికిముందు హిందూమతసిద్ధాంతములను యొకపుస్తకము ప్రచురించియుంటి. దానిని ముందుజదివియున్నవారికి ఇది బహుసులభముగ నర్థమగుననియు, దీనిననుసరించిప్రకృతితత్వప్రకాశికయను వేవపుస్తకమొకటి ప్రచురింపబోవుచున్నాడ గాన, హిందూమతసిద్ధాంతములను చదువుటవలన మానవులు ప్రపంచమందు

ఓం.

శ్రీసచ్చిదానందగురవేనమః.

హిందూమత సిద్ధాంతములోని

# ఆత్మతత్వప్రకాశిక.



1 ప్రశ్న భగవంతుడన నెట్టివాడు?

ఉత్తరము ప్రపంచమును, అందలినానావిధజంతుజాలములను. తరు, గుల్మ. లత, పాషాణాదులను పుట్టించి, పెంచి, నశింపజేయువాడు.

2 ప్రశ్న ఆయనను నీవు ఎప్పుడైన జూచితివా?

ఉత్తరము ఎన్నడును చూచియుండలేదు.

3 ప్రశ్న ఎందుచేత చూడలేదో చెప్పుమా?

ఉత్తరము చూచుటకు యత్నించితిగాని ఆయన ఎన్నడును కనుపించలేదు.

4 ప్రశ్న అంతగ యత్నించినను ఏలకనుపించలేదో?

ఉ॥ నాయందింక నేలోపములున్నవోగాని నేజెప్పజాలను.

5 ప్ర॥ పోనీ. చూచినవారినెవరి నైననడిగి తెలిసికొని యుంటివా?

ఉ॥ అడిగితినిగాని, ఎవ్వరును ఆయనఆత్మస్వరూపమ ని చెప్పిరేగాని చూపరైరి.

6 ప్ర॥ ఆత్మస్వరూపమైతేనేమి, ఎందుచేత చూడలేము ని నీవడుగ లేదా?

ఉ॥ అడిగితిని. ఆత్మయనగా దృశ్యపదార్థముకాదు. మనము దృశ్యపదార్థములను అనగా పంచభూత వికారమగు పదార్థములనుమాత్రమే చూడగ లుగుదుమని శలవిచ్చిరి.

8 ప్ర॥ పంచభూతవికారమనగ నెట్టిదని యడిగి తెలిసి కొంటివా?

ఉ॥ అది భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశ ములను, పంచభూతములయొక్క మిశ్రమాంశ మనిరి.

9 ప్ర॥ ఈయైదుభూతమ్ములైనను దృశ్యములేనా యని యడిగితివా?

ఉ॥ అడిగితి. ఇందు వాయురాకాశములనుమాత్ర ము వానివృత్తులనుబట్టి తెలియుదుమనిరి.

10 ప్ర॥ ఆవృత్తులెట్టివో తెలిసికొంటివా?

ఉ॥ చలనముచేత వాయువున్నట్లును, అవకాశమిచ్చుటచేతగాని, శబ్దముచేతగాని, ఆకాశము వున్నట్లును, తెలిసికొమ్మనిరి.

11 ప్ర॥ వాయురాకాశములను వానివృత్తులనుబట్టి తెలిసికొమ్మనిరి: తక్కినమూడుభూతములును ఏల దృశ్యములనిరి?

ఉ॥ అవి మనశరీరమువలె స్థూలభూతములుగాన, దృశ్యములని చెప్పిరి.

12 ప్ర॥ ఈయైదుభూతములును ఒకవిధమేనాయని యడిగితివా?

ఉ॥ అడిగితి. అవి రెండువిధములని శలవిచ్చిరి.

13 ప్ర॥ ఆరెండువిధము లెట్టివో తెలిసికొంటివా?

ఉ॥ స్థూలభూతములు, సూక్ష్మభూతములని ముందు హిందూమత సిద్ధాంతములలోనే బోధించితిమియనిశలవిచ్చిరి.

14 ప్ర॥ స్థూలభూతములు దృశ్యములుగాన తెలిసికొంటిమి. సూక్ష్మభూతముల నెట్లెరుంగవలయునో తెలిసికొంటివా?

ఉ॥ శబ్దగ్రహణముచేత నాకాశమును, స్పర్శగ్రహణ
ముచేత వాయువును, రూపగ్రహణముచేత నగ్ని
ని, రసగ్రహణముచేత జలమును, గంధగ్రహణ
ముచేత పృథివియు ఉన్నట్లు తెలియుమనిరి.

15 ప్ర॥ అయితే నికనీ పంచభూతవికారమెట్టిదనిరి?

ఉ॥ ఈయైదుభూతములును ఒకదానితోనొకటి మిశ్ర
మమై అన్యరూపముగఁజూపట్టునవియని తెలిపిరి.

16 ప్ర॥ అట్లు మిశ్రమమై యుండునవి ఏవియో కనుగొం
టివా ?

ఉ॥ మనముచూచే సమస్త జంగమస్థావరాదులును అ
ట్టివేయని తెలిసికొన్నానిరి.

17 ప్ర॥ ఒక్కొక్క పదార్థమునం దీయైదుభూతములును
ఏలాగామిశ్రితములై యున్నవో తెలుపుడవలేదా?

ఉ॥ అంటివి వారివిషయమై ఒక ఉపమానముమీద
బోధించిరి.

18 ప్ర॥ ఆబోధ ఎట్టిదో సేకును వినియెద చెప్పుమా?

ఉ॥ ఒక కొయ్యయందు శబ్దమున్నదిగాన దానింబట్టి
యాకాశభూతమున్నట్లును, ఆకొయ్యకఠినముగ
మనచేత స్పృశింపబడుచున్నదిగాన, వాయుభూ

తమున్నట్టును, ఆకొయ్యను మరియొకకొయ్యతో మర్దించినయెడ, అగ్నిబుట్టునుగాన, నగ్నిభూతమున్నట్టును, దానిని గాల్చగవచ్చిన పొగవలనగాని, నమలగ కనుపించు రుచివల్లగాని, జలభూతమున్నట్టును, కొయ్యను కాల్చిన బూడిదగాని, లేక కొయ్యచికి మన్నేయగునుగాన, దానియందు పృథివీభూతమున్నట్టును ఎరుంగవలయు. ఇట్లుమనకు దృశ్యమగు ప్రతిపదార్థమునందు ఇట్టి విచారణవలన పంచభూతములున్నట్టు తేలుచున్నదిగాన, రూపనామములుగల ప్రతివస్తువును పంచభూత వికారమని ఎరుంగుమనిరి.

19 ప్ర॥ ఆత్మైతే ఆత్మదృశ్యపదార్థము కాకుంటే, ఈసృష్ట్యాదుల నెట్లుచేయుచున్నదని యడిగితివా ?

ఉ॥ వాయువు దృశ్యపదార్థము కాకున్నను, వృక్షాదులను కదలించుచుండగ, మనముచూడడము లేదాయనిరి.

20 ప్ర॥ అయినే నిట్టియాత్మను చూడకుండనే ఉన్నట్టువారేలాగు ఆమోఘపరిచిరి ?

ఉ॥ ఈ యాత్మను జ్ఞానులుమాత్రము ఉన్నట్లు తెలిసి ఎల్లరకు బోధించుచున్నారనిరి.

21 ప్ర॥ వారినేత్రములు మననేత్రములవంటివేగద, వారు మరియేసాధనమువల్ల ఈయాత్మను కనుగొని యున్నారనిరి?

ఉ॥ వారికీనేత్రములకంటె వేరైన జ్ఞాననేత్రమను సాధన మున్నదనిరి.

22 ప్ర॥ ఈనేత్రమువారి కెచటనున్నదో, తెలిసకొంటివా?

ఉ॥ వారి హృదయకమలమం దున్నదనిరి.

23 ప్ర॥ వారేసాధనచే నీనేత్రమును కనుగొనిరో?

ఉ॥ జ్ఞానమను సాధనచే కనుగొనిరనిరి.

24 ప్ర॥ ఈజ్ఞానమునకై వారేసాధన చేయవలెననిరి?

ఉ॥ పెద్దలు బోధించెడి వాక్యములును, దైవమునుగురించి బోధించు వేదవేదాంగములును, పరిశీలించుటయే సాధనమనిరి.

25 ప్ర॥ ఈజ్ఞానము కలుగుటకు నింకనేమైన సాధనలున్నవేమో, కనుగొంటివా?

ఉ॥ పెద్దలవాక్యములు వినుటవల్లను, దైవసంబంధియగు ముందుచెప్పిన గ్రంథములు చదువుటవల్లను, భక్తి, వైరాగ్యములు కలుగుటయే సాధనమని తెలవిచిరి.

26 ప్ర॥ ఆభక్తివైరాగ్యము లెట్టివో తెలిసికొంటివా?

ఉ॥ పెద్దలవాక్యములు వినుటయందును, దైవసంబంధమగు గ్రంథములు చదువుటయందును, అందలి విధులను స్వీకరించి, నిషేధములను విసర్జించుటయేనని.

27 ప్ర॥ అయితే నీయాత్మ ఎచ్చటనుండుననిరి?

ఉ॥ అది అంతటను నిండియున్నదనిరి.

28 ప్ర॥ మీరు శలవిచ్చినట్లు చెట్లుకదలుటచేత వాయువు ఉన్నట్లు తెలిసికొంటిని. ఈయాత్మ ఉన్నట్లు దేనివలన తెలియనగునని యడిగితివా?

ఉ॥ ప్రపంచమును అందలి నానావిధ జంతుజాలాది సృష్టిస్థితి, లయములనుబట్టి తెలియుమనిరి.

29 ప్ర॥ ఈయాత్మ ఏపనిముట్లతో ఈపనులను చేయుచున్నదని యడిగితివా?

ఉ॥ ఏపనిముట్లు లేకయే ఇట్లు చేయుశక్తి దానియందిమిడియున్నదనిరి.

30 ప్ర॥ ఆశక్తికేమైన పేరుకలదనిరా?

ఉ॥ మాయయనుపేరు కలదనిరి.

31 ప్ర॥ ఈమాయయందు మరియేమైన గుణములు కలవే మో? తెలిసికొంటివా?

ఉ॥ సత్వము, రజస్సు, తమస్సు, అనుమూడుగుణము లు కలవనిరి.

32 ప్ర॥ ఈ త్రిగుణములేనా సృష్టి, స్థితి, లయములను చే యునదియని యడిగితివా?

ఉ॥ అడిగితి ముందుచెప్పిన ఆత్మనుగూడియే చేయగ లుగునని శెలవిచ్చిరి.

33 ప్ర॥ ఈసృష్ట్యాదులను చేయువారు బ్రహ్మ, విష్ణు, రు ద్రులందురే అదియేమని అడిగితివా?

ఉ॥ అడిగితి. త్రిగుణాత్మికమగు నీయాత్మసత్తకే అ యావృత్తులనుబట్టి ఈనామములువచ్చెనని యాన తిచ్చిరి.

34 ప్ర॥ కొందరిది మాయాకల్పనయని అందురేల నని యడిగితివా?

ఉ॥ అడిగితి. ఉన్నట్టుభ్రమపరిచి, చూపి, తుదకు లేక పోవుచున్నది గనుక అట్లందురనిరి.

35 ప్ర॥ అయితే నీయాత్మకుగూడ నిట్టిలక్షణములేమైన నున్న వేమో, తెలిసికొంటివా?

ఉ॥ సత్యము, జ్ఞానము, ఆనందము, నిత్యము, పరిపూర్ణములను అయిదులక్షణములుగలవని శలవిచ్చిరి.

36 ప్ర॥ సత్యమనగనెట్టిదో తెలిసికొంటివా?

ఉ॥ కాలత్రయమునందును దేనిచేతను బాధింపబడక ఏకరూపముగనుండునదియనిరి.

37 ప్ర॥ జ్ఞానమనగనెట్టిదియనిరి?

ఉ॥ ఏవస్తుసహాయము లేకయే, తానుస్వయముగ ప్రకాశింపుచు, తనయందున్న సమస్తమును ప్రకాశింపచేయునది యనిరి.

38 ప్ర॥ ఆనందమనగ నెట్టిదో తెలిసికొంటివా?

ఉ॥ ఏకారతయూ లేకఉండునది యనిరి?

39 ప్ర॥ ఇంక నిత్యమన నెట్టిదియనిరి?

ఉ॥ త్రికాలములయందును ఉండునదియని యానతిచ్చిరి.

40 ప్ర॥ పరిపూర్ణమన నెట్టిదియనిరి?

ఉ॥ అదియు అంతటనిండియుండునదియని తెలిసికొ
మ్మనిరి.

41 ప్ర॥ ఈశ్వరాదులక్షణములును లోకమున మరిదేనియం
దును లేవాయని యడిగితివా?

ఉ॥ దేనియందువిచారించినను ఒకటియుంటేమరియొ
కటిలేనట్టు ఋజువుపరచిరి.

42 ప్ర॥ పరమాత్మ ఏవికారములేనిదియనియంటిరే, ఇప్పు
డీగుణత్రయముతోఁగూడినసత్త్తగాక, పంచలక్షణ
ములుగూడ నీయాత్మయం దెచటనుండికలిగెనో
కనుగొంటివా?

ఉ॥ ఇటుచిత్తగింపుడు. సూర్యబింబమునుండియే బ
హిర్గతమై, ప్రపంచమంతటనువ్యాపించి. సర్వజీ
వులచే సర్వవ్యవహారములనుచేయించు ప్రకాశ
మున్నట్లే, ఆత్మయందును నీసత్తయున్నదని
శలవిడిరి.

43 ప్ర॥ ఇకద్వైతమునుగురించి మనము తెలిసికొనవలసినపద్ధ
తి ఇదియేనయని యడిగితివా?

ఉ॥ అవును. ఆయనదృశ్యముకాకున్నను ఆయనసత్తా

వ్యాకలిగిన సమస్త ప్రపంచమును, దానియందుం డుచర్యనుబట్టియే యెఱుగుమని యాజ్ఞాపించిరి.

44 ప్ర అప్పుడు పరోక్షముగ నెఱుగవలసినదేగాని పరమాత్మ ప్రత్యక్షము లేదా యెఱుగదాయని యడిగి యుంటివా?

ఉ। ఇట్లు రూపనామములుగల ప్రతివస్తువును భగవత్స్వరూపవ్యతిరిక్తమని ఎరింగి. నిషేధించుట వలన కలిగే భక్తిజ్ఞాన, వైరాగ్యములవల్ల ఆత్మస్వరూపము ప్రత్యక్షమేయగుననిరి.

45 ప్ర. ఈలా కారణుడైనపరమాత్ము డొకడున్నాడని మనమనుకోవలసిన యవసరమేమని అనలేదా?

ఉ॥ అట్టి కారణుడు లేకయే ఇట్టిజగద్విచిత్రముగలుగుట యసంభవముగాన, వానినిట్లువిభజించి ఎఱుంగవలసిన యవసరమున్నదని తెలిపిరి.

46 ప్ర॥ దానిస్వభావముచేత నిట్లగుచున్నదని ఏలతలంచగూడదని అడుగలేదా?

ఉ. ఆలాతలంచగూడదు. ఎందుచేతనన నీవుచెప్పిన స్వభావమనగ స్వరూపమేయగుననిరి.

47 ప్ర॥ అదిఎట్లో విరళముగ ఎఱింగితివా?

ఉ॥ ఎఱింగితిని, ఎట్లంటిరా కారణము లేని కార్యముం డునేమో విచారించిచూడుమనిరి,

48 ప్ర॥ కార్యకారణములనగ నెట్టివో?

ఉ॥ అగ్నియను కారణము లేకయే పొగయను కార్యముండుట యసంభవమనిరి.

49 ప్ర॥ మంచిది. ఇట్టియాత్మస్వరూపమునుగుఱించి మనము విచారించవలసినయవసరమేమని నీవు అడిగి తెలిసికొంటివా?

ఉ॥ ఈయవసరమే లేనియెడల మనముఅధోగతిపాలు, అనగ నరకముపాలగుదుమనిరి.

50 ప్ర॥ ఆనరకమెట్టిదియని అడుగలేదా?

ఉ॥ ఎన్నడు భగవద్దర్శనములేక మాయాభ్రాంతు లందగిలి దుఃఖమునొందుచుండుట యనిరి.

51 ప్ర॥ ఆభగవంతుడెట్టివాడని విచారించితిరని యడిగితివా?

ఉ॥ లోకమునజరుగుచున్న చర్యలనుబట్టి ఇందుకు కారణుడొకడున్నాడని తెలిసికొంటిమని.

56 ప్ర ఇట్లుపరమాత్మను, మాయాచర్యలను విభజించి యెఱుగుటవలన వారికేమి లాభముకలిగెనో, తెలిసికొంటివా?

ఉ ప్రపంచములో తనకు సంబంధము గలదనే భ్రమను విడిపించి,దుఃఖనివృత్తులనుగ జేసెననిరి.

57 ప్ర ఈ దుఃఖనివృత్తివలన వారికేమిలాభము కలిగెనో తెలిసికొంటివా?

ఉ తమను ఆనందరూపులనుగ జేసెనని తృప్తినొందియున్నామనిరి.

58 ప్ర ఆనందరూపులనగ, వారిశరీరలావణ్యములనుజూచియా, ఏమియంటివా?

ఉ కాదు. వారు లోకమందు పొందెడి సుఖదుఃఖరూపమగు ప్రతివిషయమును ఆనందముగ ననుభవించుటయనిరి.

59 ప్ర అపుడు వీరికి ఇది ప్రపంచమనియు, ఇదిపరమనియు. తోచుచుండునాయని అడిగితివా?

ఉ ఆటుతోపింపజేసెడి ప్రతివిషయమునకును ఆధార

మగు పరమాత్మయందే వారిలక్ష్యముండునని శ
లవిచ్చిరి

60 ప్ర ఆలక్ష్యమెంతవరకు వారికుండుననిరి?

ఉ పరమాత్మ స్వరూపముతప్ప అన్యము తోచనంతవ
రకుండుననిరి.

61 ప్ర ఏమియు తోచనపుడు పరమాత్మయందు వీరిలక్ష్య
ముంచుట ఎట్లని అడుగలేదా?

ఉ అందుకు నీప్రశ్నయే ఉత్తరము. ప్రపంచమందు
విషయవ్యాపకమున్నంతవరకు, దానినుండి త్రిప్పి
పరమాత్మయందుంతుమనిరి. వారిలక్ష్యము పర
మాత్మగానే వ్యాపకమగునపుడు ఇకలక్ష్యముం
చుట లేనియుండదనిరి.

62 ప్ర అపుడు ఆయనుభవము నెరుగుట ఎట్లని నీవడు
గలేదా?

ఉ నీవు అట్లని పొందినపుడే ఎరుంగుదువనిశెలవిచ్చిరి.

63 ప్ర ఇందుకు ఏనిదైన అనుభవము చూపవలదా యని
అడిగితివా?

జ. అనుదినమును నీవుపొందుచున్న సుషుప్తి సుఖమే, ఇందుకు తగిన దృష్టాంతమనిరి.

64 ప్ర. ఈవిషయము నాకగ్రాహ్యముగనున్నది, స్వామీ దయచేసి దీనివివరించిబోధింపుడని ప్రార్థించగా

జ. జాగ్రతలో నీవుపొందుచున్న సుఖదుఃఖములన్నియు సుషుప్తిలో మరచి, హాయిగ నిద్రించినట్లు, దేహేంద్రియాదులు తాముగాదని మరచి, ఆత్మయే తనుస్వరూపముగ పరిణమించుట మోక్షమని తెలిపిరి.

65 ప్ర. అయితే నిత్యానందలక్షణము పరమాత్మదంటివే, అది దేహస్వరూపులగు వీరికెలాగునని నీవడిగియుంటివా?

జ. నిజస్థానమనగ, దేహదృష్టిని విడిచి ఆత్మయే తామనుదృష్టియందు, లక్ష్యముంచి యున్నారు గనుకనే, తాముసదా మోక్షసామ్రాజ్యాల నుందురనిరి.

66 ప్ర. నిర్వికారుడైన ఆత్మను మీరెట్లు సేవింతురని అడిగితివా?

ఉ॥ ఆయన యనంత కల్యాణ గుణములను బట్టియే సేవింపనగుననిరి.

67 ప్ర॥ రూపము లేనివానికి గుణములెట్లు కల్పించిరో?

ఉ॥ భక్తులు ఆపత్కాలములయందు ఆయనను వేడగావచ్చి, రక్షించడము లేదా యనిరి.

68 ప్ర॥ అప్పుడీ పరమాత్మ రూపనామములు కలదాయెగదా యని యనలేదా?

ఉ॥ రూపనామములుగల నిన్ను రక్షించుటకు, ఆపరమాత్మయు రూపనామములు ధరించవలసివచ్చెననిరి.

69 ప్ర॥ ఇందులకేమైన దృష్టాంతము గలదాయని యడిగితివా?

ఉ॥ గజేంద్రమోక్షమను గ్రంథములో గజేంద్రుడు చేసిన ప్రార్థనయే దృష్టాంతమనిరి.

70 ప్ర॥ ఇన్నిచిన్నెలు గలవానిని ఎట్లెరుంగనగునో తెలిసికొంటివా?

ఉ॥ ఆత్మానాత్మ వివేచనయును జ్ఞానసాధనచేతనే ఆయనను ఎఱుంగదగుననిరి.

71 ప్ర॥ ఆవివేచన నాకెట్లులభించునని అడుగలేదా ?

ఉ॥ ఆవిషయమైచెప్పెడి గ్రంథములను చదువుటచేతను, పెద్దలవాక్యములు వినుటచేతను లభించుననిరి.

72 ప్ర॥ అవాక్యములు నాకెవరు బోధజేతురని అడిగియుంటివా ?

ఉ॥ ఆవిషయముల నెరిఁగినవారిని వెదకి, వానిసేవ జేసినయడ బోధింతురనిరి.

73 ప్ర॥ గ్రంథము లెచ్చటనైన దొరుకును, పెద్దలెచట కాన్పింతురని యడిగితివా ?

ఉ॥ మీరు సమస్తధర్మముల నెరింగియు, ఎరుగనివారివలె ఆత్మావలోకనపరులై, అచ్చట అచ్చట నుందురనిశెలవిచ్చిరి.

74 ప్ర॥ అట్టివారిని తెలియుటెట్లని యడిగితివా ?

ఉ॥ వారి ప్రవర్తనలనుబట్టి ఎఱుంగవలెననిరి.

75 ప్ర॥ వారిట్టియాత్మస్వరూపులై యుండియు, లోకమునం దెట్లు సంచరింతురని అడుగలేదా ?

ఉ॥ లోకమునందుండినను లోకవాంఛలందగులక, కామాదుల నడంచి, ఆత్మావలోకనపరులై, యదృచ్ఛాలాభ సంతుష్టిచే, లేకాడున్నట్టు అన్యులకుతోచే ఈప్రారబ్ధోపాది ముక్తిపర్యంతము, తమ్మునను సరించినవారికి ఈసద్ధర్మములం దెలుపుచు, లోకమున సంచరించుచుందురని శెలవిడరి.

ఓం తత్ సత్



